# అథ ఏకచత్వారింశో%ధ్యాయః

## శాలగ్రామశిల విష్ణుస్వరూపము

వ్యాస ఉవాచ |

నారాయణశ్చ భగవాన్ వీర్యాధానం చకార హ | తులస్యాః కేన యత్నేన యోనౌ తద్వక్తు మర్హసి || 1

వ్యాసుడిట్లు పలికెను-

నారాయణ భగవానుడు ఏ ప్రయత్నముచే తులసితో రమించగల్గెనో చెప్పుడు (1).

సనత్కుమార ఉవాచ |

నారాయణో హి దేవానాం కార్యకర్తా సతాం గతిః | శంఖచూడస్య రూపేణ రేమే తత్రామయా సహ || 2

తదేవ శృణు విష్ణోశ్చ చరితం ప్రముదావహమ్ | శివశాసనకర్తుశ్చ మాతుశ్చ జగతాం హరేః || 3

రణమధ్యే వ్యోమవచుశ్రుత్వా దేవేన శంభునా | ప్రేరితశ్శంఖచూడస్య గృహీత్వా కవచం పరమ్ || 4

విప్రరూపేణ త్వరితం మాయయా నిజయా హరిః | జగామ శంఖచూడస్య రూపేణ తులసీ గృహమ్ || 5

దుందుభిం వాదయామాస తులసీద్వారసన్నిధౌ | జయశబ్దం చ తత్రైవ బోధయామాస సుందరీమ్ || 6

తచ్ఛ్రుత్వా చైవ సా సాధ్వీ పరమానందసంయుతా | రాజమార్గం గవాక్షేణ దదర్శ పరమాదరాత్ || 7

బ్రాహ్మణ   భ్యో ధనం దత్త్వా కారయామాస మంగళమ్ | ద్రుతం చకార శృంగారం జ్ఞాత్వా%యాతం నిజం పతిమ్ || 8

సనత్కుమారుడిట్లు పలికెను-

దేవతల కార్యమును చేయువాడు, సత్పురుషులకు శరణ్యుడు అగు నారాయణుడు శంఖచూడరూపమును దాల్చి ఆతని భార్యతో రమించెను (2). జగన్మాత యగు పార్వతి మరియ శివుని శాసనమును అమలు జేయువాడు, పాపహరుడు అగు విష్ణువు యొక్క ఆనందదాయకమగు ఆ వృత్తాంతమును వినుము (3). రణరంగమధ్యములో ఆకాశవాణిని విన్న శంభుదేవునిచే ప్రేరిపితుడైన హరి శంఖచూడుని గొప్ప కవచమును తన మాయచే బ్రాహ్మణరూపమును ధరించి గ్రహించి, వెంటనే శంఖచూడుని రూపముతో తులసి యొక్క ఇంటికి వెళ్లెను. (4, 5). తులసి ఇంటి ద్వారమునకు సమీపములో దుందుభి ధ్వనులను, జయ జయ శబ్దములను చేయించి, ఆ సుందరికి తెలివి వచ్చునట్లు చేసెను (6). ఆ పతివ్రత ఆ శబ్దములను వినుట తోడనే పరమానందమును పొంది అధికమగు ఆదరముతో రాజమార్గమును కిటికీలో నుండి చూచెను (7). తన భర్త తిరిగి వచ్చినాడని తెలుసుకొని ఆమె వెంటనే బ్రాహ్మణులకు ధనము నిచ్చి మంగళకర్మలను చేయించి, వెంటనే తాను అలంకరించు కొనెను (8).

అవరుహ్య రథాద్విష్ణు స్తద్దేవ్యా భవనం య¸° | శంఖ చూడ స్వరూపస్స మాయవీ దేవ కార్యకృత్ || 9

దృష్ట్వా తం చ పురః ప్రాప్తం స్వకాంతం సా ముదాన్వితా | తత్పాదౌ క్షాలయామాస ననామ చరురోద చ || 10

రత్న సింహాసనే రమ్యే వాసయామాస మంగలమ్ | తాంబూలం చ దదౌ తసై#్మ కర్పూరాది సువాసితమ్ || 11

అద్య మే సఫలం జన్మ జీవనం సంబభూవ హ | రణ  గతం చ ప్రాణ  శం పశ్యంత్యాశ్చ పునర్గృహే || 12

ఇత్యుక్త్వా సకటాక్షం సా నిరీక్ష్య సస్మితం ముదా | పప్రచ్ఛ రణ వృత్తాంతం కాంతం మధురయా గిరా || 13

మాయావి, దేవకార్యమును చేయువాడు అగు ఆ విష్ణువు శంఖచూడ రూపములో రథమునుండి దిగి ఆ దేవియొక్క భవనములోనికి వెళ్లెను (9). తన ఎదుటకు వచ్చిన తన ప్రియుని గాంచి ఆమె ఆనందించి ఆతని పాదములను కడిగి ప్రణమిల్లి రోదించెను (10). ఆతనిని సుందరమగు రత్న సింహాసనముపై కూర్చుండబెట్టి కర్పూరము మొదలగు సుగంధ ద్రవ్యములతో కూడిన మంగళ తాంబూలము నాతనికి అందజేసెను (11), యుద్ధమునకు వెల్లి మరల తిరిగి వచ్చిన ప్రాణప్రియుని ఇంటిలో గాంచుచున్న నా యొక్క పుట్టుక మరియు జీవితము ఈనాడు సఫలమైనవి (12). ఇట్లు పలికి ఆమె ప్రియుని ఆనందముతో చిరునవ్వుతో ఓరచూపులు చూస్తూ మధురమగు వాక్కులతో యుద్ధవార్తలనిట్లు ప్రశ్నించెను (13).

తులస్యువాచ |

అసంఖ్య విశ్వ సంహర్తా స దేవవరః ప్రభుః | యస్యాజ్ఞావర్తినో దేవా విష్ణుబ్రహ్మాదయస్సదా || 14

త్రిదేవ జనక సోऽత్ర త్రిగుణాత్మా చ నిర్గుణః | భ##క్తేచ్ఛయా చ సగుణో హరిబ్రహ్మ ప్రవర్తకః || 15

కుబేరస్య ప్రార్థనయా గుణరూపధరో హరః | కైలాస వాసీ గణపః పరబ్రహ్మ సతాం గతిః || 16

యస్మై#్యక పలమాత్రేణ కోటి బ్రహ్మాండ సంక్షయః | విష్ణు బ్రహ్మాదయోऽతీతా బహవః క్షణమాత్రతః || 17

కర్తుం సార్ధం చ తేనైవ సమరం త్వం గతః ప్రభో | కథం బభూవ సంగ్రామస్తేన దేవసహాయినా || 18

కుశలీ త్వమిహాయాతస్తం జిత్వా పరమేశ్వరమ్ | కథం బభూవ విజయస్తవ బ్రూహి తదేవ మే || 19

శ్రుత్వేత్థం తులసీ వాక్యం స విహస్య రమాపతిః | శంఖచూడ రూపధరస్తామువాచామృతం వచః || 20

తులసి ఇట్లు పలికెను-

దేవదేవుడు, సమస్త బ్రహ్మాండములను ఉపసంహరించువాడునగు ఆ శివప్రభుని కనుసన్నలలో విష్ణుబ్రహ్మాదిదేవతలందరు సర్వదా మెలగుచుందురు (14). సత్త్వరజస్తమోగుణ స్వరూపుడు, బ్రహ్మవిష్ణు రుద్రులకు తండ్రి, నిర్గుణుడు, భక్తుల కోర్కె మేరకు రూపమును దాల్చినవాడు, బ్రహ్మ విష్ణువులను ప్రవర్తిల్ల జేయువాడు (15), కుబేరుని కోర్కె మేరకు త్రిగుణాత్మకమగు రూపమును దాల్చి కైలాసమునందుండు వాడు, పాపహారి,గణములను రక్షించువాడు, పరబ్రహ్మ, సత్పురుషులకు శరణ్యుడు (16) అగు శివుని ఒక క్షణ కాలములో కోటి బ్రహ్మాండములు క్షయమును పొందును. ఆయన యొక్క క్షణ మాత్ర కాలములో విష్ణు బ్రహ్మాదుల అనేకుల ఆయుర్దాయములు గడిచిపోవును (17). ఓ ప్రభూ! అట్టి శివునితో యుద్ధమును చేయుటకు నీవు వెళ్లి యుంటివి. దేవ సాహాయ్యకారియగు ఆయనతో యుద్ధము ఎట్లు జరిగినది? (18). నీవు పరమేశ్వరుని జయించి ఇచటకు క్షేమముగా తిరిగి వచ్చితివి. నీకు విజయము ఎట్లు కలిగెను? ఆ విషయమును నాకు నిశ్చయముగా చెప్పుము (19). తులసియొక్క ఈ మాటను విని శంఖచూడుని రూపములోనున్న ఆ లక్ష్మీపతి నవ్వి ఆమెతో అమృతప్రాయములగు వచనముల నిట్లు పలికెను (20).

భగవానువాచ |

యదాహం రణ భూమౌ చ జగామ సమరప్రియః | కోలాహలో మహాన్ జాతః ప్రవృత్తో%భూన్మహారణః || 21

దేవదానవయోర్యుద్ధం సంబభూవ జయైషిణోః | దైత్యాః పరాజితాస్తత్ర నిర్జరైర్బల గర్వితైః || 22

తదాహం సమరం తత్రాకార్షం దేవైర్బలోత్కటైః | పరాజితాశ్చ తే దేవాశ్శంకరం శరణం యయుః || 23

రుద్రోఽపి తత్సహాయార్థం మాజగామ రణం ప్రతి | తేనాహం వై చిరం కాల మ¸ºత్సం బలదర్పితః || 24

ఆవయోస్సమరః కాంతే పూర్ణమబ్దం బభూవ హ | నాశో బభూవ సర్వేషా మసురాణాం చ కామిని || 25

ప్రీతిం చ కారాయామాస బ్రహ్మ చ స్వయమావయోః | దేవానామధికారాశ్చ ప్రదత్తా బ్రహ్మశాసనాత్ || 26

మయాగతం స్వభవనం శివలోకంశివో గతః | సర్వస్వాస్థ్య మతీవాప దూరీభూతో హ్యుపద్రవః || 27

భగవంతుడిట్లు పలికెను-

యుద్ధమునందు ప్రీతిగల నేను యుద్ధభూమికి వెళ్లితిని. అచట పెద్ద కోలాహలముతో పెద్ద యుద్ధము ఆరంభమాయెను (21). జయకాంక్షులగు దేవతలు, దానవులు పరస్పర యుద్ధము నారంభించిరి. ఆ యుద్ధములో బలముచే గర్వించియున్న దేవతలచే దానవులు ఓడింపబడిరి (22). అపుడు నేను అచట బలగర్వితులైయున్న దేవతలతో యుద్ధమును చేసితిని. ఆ దేవతలు నా చేతిలో ఓడి శంకరుని శరణు పొందిరి (23). వారికి సాహాయ్య మొనర్చుటకై రుద్రుడు యుద్ధమునకు వచ్చెను. బలగర్వితుడనైన నేను ఆయనతోచిరకాలము యుద్ధమును చేసితిని (24). ఓ ప్రియులారా! మా ఇద్దరి యుద్ధము సంవత్సర కాలము జరిగెను. ఓ సుందరీ! దానవులందరు నశించిరి (25). బ్రహ్మ స్వయముగా మాకిద్దరికీ సంధిని చేయించెను. బ్రహ్మయొక్క ఆజ్ఞచే దేవతల అధికారములను వారికి అప్పజెప్పితిని (26). నేను నా ఇంటికి వచ్చితిని. శివుడు తన లోకమునకు వెళ్లెను. సర్వప్రాణులు గొప్ప సుఖమును పొందినవి. ఉపద్రవము తొలగి పోయినది (27).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వా జగతాం నాథశ్శయనం చ చకార హ | రేమే రమాపతిస్తత్ర రమయా స తయా ముదా || 28

సా సాధ్వీ సుఖ సంభావకర్షణస్య వ్యతిక్రమాత్ | సర్వం వితర్కయా మాస కస్త్వ మేవేత్యువాచ సా || 29

సనత్కుమారుడిట్లు పలికెను -

జగత్ప్రభువగు ఆ లక్ష్మీపతి ఇట్లు పలికి అచట శయనించి సుందరితో కలసి ఆనందముగా రమించెను (28). సుఖము, ప్రీతి వచనములు, ఆకర్షణలలో గల భేదమును బట్టి ఆ పతివ్రత సర్వమును ఊహించి 'నీ వెవ్వరివి? ' అని పలికెను (29)

తులస్యువాచ |

కో వా త్వం వద మామాశు భుక్తాహం మాయయా త్వయా | దూరీకృతం యత్సతీత్వమథ త్వాం వై శపామ్యహమ్ || 30

తులసి ఇట్లు పలికెను-

నీ వెవ్వరివి? నాకు వెంటనే చెప్పుము. నీవు మాయచేసి నన్ను భోగించితివి. నా పాతివ్రత్యమును చెడగొట్టితివి. నీవు చెప్పనిచో, నిన్ను నేను శపించెదను (30).

సనత్కుమార ఉవాచ |

తులసీవచనం శ్రుత్వా హరిశ్శాప భ##యేన చ | దధార లీలయా బ్రహ్మన్ స్వమూర్తిం సుమనోహరామ్ || 31

తద్దృష్ట్వా తులసీ రూపం జ్ఞాత్వా విష్ణుం తుచిహ్నతః | పాతివ్రత్య పరిత్యాగాత్ క్రుద్ధా సా తమువాచ హ || 32

సనత్కుమారుడిట్లు పలికెను-

ఓ బ్రాహ్మణా! తులసియొక్క మాటను విని విష్ణువు శాపమువలన భయపడిన వాడై అవలీలగా మిక్కిలి అందమగు తన మూర్తిని దాల్చెను (31). తులసి ఆ రూపమును గాంచి, చిహ్నములను బట్టి విష్ణువు అని గ్రహించి, తన పాతివ్రత్యము చెడినందులకు కోపించి ఆతనితో నిట్లనెను (32).

తులస్యువాచ |

హే విష్ణో తే దయా నాస్తి పాషాణ సదృశం మనః | పతిధర్మస్య భంగేన మమ స్వామీ హతః ఖలు || 33

పాషాణ సదృశస్త్వం చ దయాహీనో యతః ఖలః | తస్మాత్పాషాణ రూపస్త్వం మచ్ఛాపేన భవాధునా || 34

యే వదంతి దయాసింధుం త్వా భ్రాంతాస్తే న సంశయః | భక్తో వినాపరాధేన పరార్థే చ కథం హతః || 35

తులసి ఇట్లు పలికెను-

ఓ విష్ణో! నీకు దయలేదు. నీ మనస్సు రాయి వంటిది. నా పాతివ్రత్యమునకు భంగము కలుగుటచే నా భర్త సంహరింపబడినాడు (33). నీవు దుష్టుడవు. రాయివంటి వాడవు, దయలేని వాడవు. కావున నా శాపముచే నీవు ఇప్పుడు పాషాణరూపుడవు కమ్ము (34). నీవు దయారూపుడవని పలుకువారు భ్రాంతిని పొందిన వారనుటలో సందేహము లేదు. ఇతరుల ప్రయోజనము కొరకై, అపరాధము చేయని ఒక భక్తుని ఎట్లు హతమార్చ గల్గితివి ? (35).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వా తులసీ సా వై శంఖచూడప్రియా సతీ | భృశం రురోద శోకార్తా విలలాప భృశం ముహుః || 36

తతస్తాం రుదతీం దృష్ట్వా స విష్ణుః పరమేశ్వరః | సస్మార శంకరం దేవం యేన సంమోహితం జగత్ || 37

తతః ప్రాదుర్బభూవాథ శంకరో భక్తవత్సలః | హరిణా ప్రణతశ్చాసీత్సంనుతో వినయేన సః || 38

శోకాకులం హరిం దృష్ట్వా విలపంతీం చ తత్ప్రియామ్ | నయేన బోధయామాస తం తాం కృపణవత్సలః || 39

సనత్కుమారుడిట్లు పలికెను-

ఇట్లు పలికి శంఖచూడుని ప్రియురాలు, పతివ్రతయగు ఆ తులసి శోకపీడితురాలై పలుమార్లు తీవ్రముగా రోదించెను (36). ఏడ్చుచున్న ఆమెను గాంచి అపుడా పరమేశ్వరుడగు విష్ణువు, ఎవనిచే జగత్తు మోహింపచేయబడుచున్నదో, అట్టి శంకరదేవుని స్మరించెను (37). అపుడు భక్తవత్సలుడగు శంకరుడు ఆవిర్భవించగా, విష్ణువు ఆయనకు వినయముతో ప్రణమిల్లి స్తుతించెను (38). శోకముతో కంగారుపడుతున్న విష్ణువును, ఏడ్చుచున్న శంఖచూడ ప్రియురాలగు తులసిని గాంచి దీనులయందు ప్రేమగల శివుడు వారిద్దరినీ అనునయించి నచ్చజెప్పెను (39)

శంకర ఉవాచ |

మారోదీస్తులసి త్వం హి భుంక్తే కర్మఫలం జనః | సుఖదుఃఖదో న కో%ప్యస్తి సంసారే కర్మసాగరే || 40

ప్రస్తుతం శృణు నిర్దుఃఖం శృణోతి సమనా హరిః | ద్వయోస్సుఖకరం యత్తద్ర్బవీమి సుఖహేతవే || 41

తపస్త్వయా కృతం భ##ద్రే తసై#్యవ తపసః ఫలమ్ | తదన్యథా కథం స్యాద్ద్వైజాతం త్వయి తథా చ తత్ || 42

ఇదం శరీరం త్యక్త్వా చ దివ్యదేహం విధాయ చ | రమస్వ హరిణా నిత్యం రమయా సదృశీ భవ || 43

తవేయం తనురుత్సృష్టా నదీరూపా భ##వేదిహ | భారతే పుణ్య రూపా సా గండకీతి చ విశ్రుతా || 44

కియత్కాలం మహాదేవి దేవపూజనసాధనే | ప్రధానరూపా తులసీ భవిష్యతి వరేణ మే || 45

స్వర్గే మర్త్యే చ పాతాళే తిష్ఠ త్వం హరిసన్నిధౌ | భవ త్వం తులసీ వృక్షో వరా పుష్పేషు సుందరీ || 46

వృక్షాధిష్ఠాదృదేవీ త్వం వైకుంఠే దివ్యరూపిణీ | సార్ధం రహసి హరిణా నిత్యం క్రీడాం కరిష్యసి || 47

శంకరుడిట్లు పలికెను-

ఓ తులసీ! నీవు దుఃఖించకము. మానవుడు కర్మఫలము ననుభవించును. కర్మసముద్రమనదగిన ఈ సంసారములో సుఖదుఃఖముల నిచ్చువారు ఇతరులు ఎవ్వరూ కారు (40). నీవు దుఃఖమును వీడి ప్రస్తుత కర్తవ్యమును గూర్చి వినుము. విష్ణువు ప్రసన్నమనస్కుడై వినుచున్నాడు.మీ ఇద్దరికీ సుఖమును కలిగించు ఉపాయము గలదు. దానిని చెప్పెదను (41). ఓ మంగళ స్వరూపురాలా! నీవు తపస్సును చేసితివి. ఆ తపస్సుయొక్క ఫలము నీకు దక్కకుండా ఎట్లు పోవును? నీకు దాని ఫలము ఇపుడు లభించుచున్నది (42). నీవీ శరీరమును విడనాడి దివ్యదేహమును దాల్చి నిత్యము విష్ణువుతో రమిస్తూ లక్ష్మీ సమానురాలవు కమ్ము (43). నీచే విడువబడిన ఈ నీ దేహము పుణ్య నదీరూపమును దాల్చి గండకీయని ప్రసిద్ధిని గాంచి ఈ భారతదేశములో ప్రవహించ గలదు (44). ఓ మహాదేవీ! దేవతలను పూజించే సామగ్రిలో నా వరముచే తులసి కొంతకాలము ప్రధానవస్తువు అగును (45). స్వర్గ భూలోక పాతాళములలోనీవు ఉంటూనే హరి సన్నిధియందు కూడ ఉండుము. నీవు తులసి మొక్కవు అగుము. ఈ మొక్క పుష్పములు గల మొక్కలకంటే సుందరముగా నుండును (46). తులసి వృక్షమునకు అధిష్ఠాతృ దేవియగు నీవు దివ్యరూపమును దాల్చి వైకుంఠములో విష్ణువుతో గూడినిత్యము ఏకాంతములో రమించగలవు (47).

నద్యధిష్ఠాతృదేవీ యా భారతే బహుపుణ్యదా | లవణోదస్య పత్నీ సా హర్యంశస్య భవిష్యసి || 48

హరిర్వై శైలరూపీ చ గండకీ తీర సన్నిధౌ | సంకరిష్యత్యధిష్ఠానం భారతే తప శాపతః || 49

తత్ర కోట్యశ్చ కీటాశ్చ తీక్ష్ణ దంష్ట్రా భయంకరాః | తచ్ఛిత్వా కుహరే చక్రం కరిష్యంతి తదీయకమ్ || 50

శాలగ్రామశిలా సా హి తద్భేదాదతి పుణ్యదా |
లక్ష్మీనారాయణాఖ్యాదిశ్చక్ర భేదాద్భవిష్యతి || 51

శాలగ్రామ శిలా విష్ణో తులస్యస్తవ సంగమః | సదా సాదృశ్య రూపా
యా బహుపుణ్య వివర్ధనీ || 52

తులసీ పత్ర విచ్ఛేదం శాలగ్రామే కరోతి యః | తస్య జన్మాంతరే
భ##ద్రే స్త్రీ విచ్ఛేదో భవిష్యతి || 53

తులసీపత్ర విచ్ఛేదం శంఖం హిత్వా కరోతి యః | భార్యాహీనో
భ##వేత్సో%పి రోగీ స్యాత్సప్త జన్మసు || 54

శాలగ్రామశ్చ తులసీ శంఖం చైకత్ర ఏవ హి | యో రక్షతి మహాజ్ఞానీ
స భ##వేచ్ఛ్రీ హరిప్రియః || 55

త్వం ప్రియశ్శంఖ చూడస్య చైకమన్వంతరావధి | శంఖేన సర్ధిం
త్వద్భేదః కేవలం దుఃఖదస్తవ || 56

భారతదేశములో ప్రవహించే, మహాపుణ్యమునిచ్చు నదికి అధిష్ఠాన దేవతవై, విష్ణువుయొక్క అంశయగు సముద్రునకు భార్యవు కాగలవు (48). నీ శాపముచే విష్ణువు భారతదేశములోని గండకీనదీ తీరమునందు శైలరూపమును దాల్చి ఆశైలమునకు అధిష్ఠానదేవత కాగలడు (49). దానియందు కోట్లాది భయంకరములైన, పదునైన దంతములుగల కీటకములు ఆ రాతిని ఛేదించి లోపల విష్ణుచక్రాకారమును మలచగలవు (50). ఆ పర్వతము నుండి వేరువడిన అట్టి శకలమే మహాపుణ్యప్రదమగు శాలగ్రామ శిలయగును. వాటి లోపల గల చక్రమునందలి భేదమును బట్టి వాటికి లక్ష్మీనారాయణ ఇత్యాది నామములు కలుగును (51). ఓ విష్ణూ! నీతో తులసియొక్క సమాగమమునకు ప్రతీకయగు శాలగ్రామ శిల సర్వదా ఏకరూపముగా నుండి మహాపుణ్యమును వర్ధిల్లజేయును (52). ఓ మంగళస్వరూపులారా! శాలగ్రామమునుండి తులసి పత్రములను విడదీసిన వ్యక్తి మరు జన్మలో భార్యా వియోగమును పొందును (53). శంఖమును విడిచిపెట్టి తులసీ పత్రములను కోయు వ్యక్తి భార్యా వియోగమును పొందుటయే గాక ఏడు జన్మలలో

రోగి యగును (54). ఏ మహాజ్ఞాని శాలగ్రామమును, తులసిని,శంఖమును ఒకే స్థానములో భద్రము చేయునో, వాడు శ్రీహరికి ఇష్టుడు అగును (55). నీవు ఒక మన్వంతర కాలము శంఖచూడునకు ప్రియురాలవై ఉంటివి. ఇపుడు నీకు ఆతనితో వియోగము మహాదుఃఖమును కలిగించినది (56).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వా శంకరస్తత్ర మాహాత్మ్యమూచివాంస్తదా |
శాలగ్రామశిలాయాశ్చ తులస్యా బహుపుణ్యదమ్ || 57

తతశ్చాంతర్హితో భూత్వా మోదయిత్వా హరిం చ తామ్ | జగామ స్వాలయం శంభుశ్శర్మదో హి సదా సతామ్ || 58

ఇతి శ్రుత్వా వచశ్శంభోః ప్రసన్నాతు తులస్యభూత్ | తద్దేహం చ పరిత్యజ దివ్యరూపా బభూవ హ || 59

ప్రజగామ తయా సార్ధం వైకుంఠం పమలాపతిః | సద్యస్తద్దేహజాతా చ బభూవ గండకీ నదీ || 60

శైలో%భూదచ్చుతస్సో%పి తత్తీరే పుణ్యదో నృణామ్ | కుర్వంతి తత్ర కీటాశ్చ ఛిద్రం బహువిధం మునే || 61

జలే పతంతి యాస్తత్ర శిలాస్తాస్త్వతి పుణ్యదాః | స్థలస్థా పింగళా జ్ఞేయాశ్చోపతాపాయ చైవ హి || 62

ఇత్యేవం కథితం సర్వం తవ ప్రశ్నాను సారతః | చరితం పుణ్యదం శంభో స్సర్వకామ ప్రదం నృణామ్ || 63

ఆఖ్యానమిదమాఖ్యాతం విష్ణుమాహాత్మ్యమిశ్రితమ్ | భుక్తి ముక్తి ప్రదం పుణ్యం కిం భూయశ్శ్రోతు మిచ్ఛసి || 64

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్ర సంహితాయాం యుద్ధఖండే తులసీ శాపవర్ణనం నామ ఏకచత్వారింశో%ధ్యాయః (41).

సనత్కుమారుడిట్లు పలికెను -

ఈ తీరున ఆ సమయములో శంకరుడు శాలగ్రామ శిల, తులసి అను వాటి యొక్క మహాపుణ్యప్రదమగు మాహాత్మ్యమును చెప్పెను (57). అపుడు, సర్వదా సత్పురుషులకు సుఖమునిచ్చు శంభుడు విష్ణువును, తులసిని ఆనందింపజేసి అంతర్హితుడై తన ధామమును చేరెను (58). శంభుని ఈ పలుకులను విని తులసి ప్రసన్నురాలై ఆ దేహమును విడిచి దివ్య రూపమును పోందెను (59). లక్ష్మీపతి ఆమెతో గూడి వైకుంఠమునకు వెళ్లెను. ఆమె దేహమునుండి తత్క్షణమే గండకీనది ఆవిర్భవించెను (60). ఆ నదీ తీరమునందు విష్ణువు శైలరూపముగా వెలసి మానవులకు పుణ్యము నిచ్చుచున్నాడు. ఓ మునీ! అచట కీటకములు శిలలయందు ఉన్న బహువిధముల ఛిద్రములను చేయుచుండును (61). అచట నదీ జలములో పడిన శిలలు మహాపుణ్యము నిచ్చును. నేలమీద ఉన్న శిలలకు పింగళములని పేరు. అవి హానిని కలిగించును (62). ఈ విధముగా మనవులకు కోరికల నన్నిటినీ ఈడేర్చే పుణ్యప్రదమగు శంభుచరితము నంతనూ నీ ప్రశ్నకు తగినట్లుగా చెప్పియుంటిని (63). విష్ణువు యొక్క మాహాత్మ్యముతో కలిసియున్న ఈ పుణ్యగాథ భుక్తిని ముక్తిని ఇచ్చును. దీనిని చెప్పియుంటిని. ఇంకనూ ఏమి వినగోరు చున్నావు? (64).

శ్రీ శివమహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధఖండలో తులసీ శాపవర్ణన మనే నలుబది ఒకటవ

అధ్యాయము ముగిసినది (41).